శ్రీరస్తు.

శ్రీసుబ్బరాయపద్యంబులను

# మానవధర్మప్రదీపిక.

రెండవసంపుటము.

---

ఇందున

సుమతిపద్యములను-యచలమార్గమునుగలిపి

లోకహితార్థంబుగ బ్రాహ్మణక్రాక నివాసుండగు

పోకూరు సుబ్బరాయునిచే

రచియింపబడి

పండితులచే సరిజూపించి,

ముముక్షు జనాహ్లాదకరంబగునటుల

తియ్యబిండి మల్లయ్యగారున్ను మరికొందరియొక్క

ద్రవ్యసహాయంబున

---

కావలి

ఎడ్వర్డు ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

---

1912.

శ్రీ

# విజ్ఞప్తి.

---

శ్రీమద్వేదాంత సారులును, మహాయోగపురుషులును, భావాతీతులును, విశ్వబ్రహ్మవంశోద్భవులును, సువర్ణసగోత్రస్థులును హనుమునిగిరి నివాసకులునగు చెరుకూరి శివరామ బ్రహ్మేంద్రయచలగురుస్వాములు మదీయజన్మ సాఫల్యతనుగురించి శ్రీరాజయోగముపదేశించి కొన్నిదినంబుల కనుభవజ్ఞానమును పరిశీలించి కవిత్వశిద్ధిగలుగ నభయంబొసంగె, నంతకొందరు మిత్రులభిలషింప నేను గురుతారావళియును, మైరావణనాటకంబును, వృమమహేశ్వర శతకంబును, త్రిపురాసుర వధయును, సుమతిపద్యములను, యచలమార్గంబును, సుందరాకాండంబును, వచనరీతి లఘువైద్యశాస్త్రిఁబును, రచియించినాడ. ధనములేమిచే కొందరి సహాయంబువలన 1910 సంవత్సరంబున రచియించిన సుబ్బరాయపద్యంబులను మానవధర్మప్రదీపికలో రెండవసంపుటమునందు ఇహాపర ధర్మంబులుండుటఁజేసి ఈగ్రంథంబును, ఇందుననే సుమతిపద్యములను, యచలమార్గంబును, జేర్చి ముద్రింపించడమైనది.

యిట్లార్యజన విధేయుడు.

బ్రాహ్మణక్రాకలో

పోకూరు సుబ్బరాయుడు.

శ్రీ

షష్ట్యాది సీసము.

---

శ్రీవసుంధరనును శ్రేయుండు భద్రాశ్వసంబనియొడి గోత్రసం
భవుండు । ప్రవిమలుండును విశ్వబ్రహ్మవంశుండును శివరామ నా
మంబుచేత ప్రబలు । సత్పాత్రుండాతని సతిజొన్నమాంబయా న
మ్మిథునంబున కవతిరించె । మల్లయాచార్యుండు మహదయిశ్వర్యుం
డు మహితమానసుడు సన్మార్గధనుడు । కదర్ప సుందరాకారుండు
సజ్జనామోదుండు ననుగాంచి మోదమలర । కృతినియొక్కటిజెప్పి
కీర్తినొందుమటంచు పలుకరింపమనంబు బరమహర్ష । మొందిగు
రుడు దెల్పును ముఖ్యాంశములుకొన్ని । శ్రాశిసుబ్బరాయ స్వా
మివారి । కర్ణంబుచేతు నబలుండ గ్రంథంబు । నాదరింపవల
యు నార్యులార.

ఇట్లు సుజనవిధేయుడు,

పోకూరు సుబ్బరాయుడు.



శ్రీరాములు.

శుభమస్తు.

శ్రీ సుబ్బరాయపద్యములను

# మానవధర్మప్రదీపిక.

మొదటిభాగము.

---

శ్రీ గిరిజాముఖాంభోధవుఁడు శ్రీలలరారుచుఁ గోర్కెలీడేర్పఁగన్ ।
నాగముఁ దాల్చి సన్నుత నవీనసుధాంశ త్రినేత్రధారుఁడై ।
నాగరికంబు లేమివడి నాశ్రయుఁడైన సుభూషణాకృతిన్ ।
యోగి వెలుంగుదైవము మదీప్సితవ్రాతము దీర్చు వేడుకన్ ॥

ఉ॥ శ్రీలలనాజనార్దనుల జెల్వగు గోత్రజభూతనాథులన్ । చాలఁగ భారతీవిధుల సామజవక్త్రి గురుప్రభోత్తముల్ । మేలగు భక్తిఁ జేగొలిచి మేదినిమాయిలు వేల్పులైనయా । వ్యాళకులేంద్రు పేరికృతి వ్రాసినమన్ననఁ జేతుఁ బ్రోవఁగన్ ॥ కం॥ కృతిలో పద్యములకు తుదన్ । నతుకుకునే సుబ్బరాయుఁడను నది మొదలీ । క్షితిగల సర్వాఖ్యలున । న్నతిమెనకునాది శేషుఁడారసి బ్రోవన్ ॥ సీ॥ వసుధ విశ్వబ్రహ్మ వంశనాగరసోము దక్షాలతేజోవంతుఁడమలమాన । సుఁదుసజ్జనస్తోత్రుండు పోకూరి వీరాచార్యుఁడను ఘనుండలరుచుండు । అచ్చమాంబనఁదగు సతినికళత్రంబు యమ్మిథునంబునకవతరించి । నట్టి పుత్రత్రయంబతి యోగ్యులనవచ్చు నందున మత్పిత్రుఁడమలయశుఁడు । సుబ్బరాయాహ్వయుండని సొంపుమీరు । మాతృకభిధానమనిన కామాక్షమాంబ । వారలకు ముద్దుతనయుండ పరగనన్ను । సుబ్బరాయుండటందురు సుబ్బరాయ ॥ గీ॥ మానువంశగోత్రమరయ భ

ప్రాశ్వప । మ్లానిడునాథుమయ్యొవినుమ్మునీవు । పూర్ణకరుణావలన బొడముపంశంబును । నన్ను నేలవలయు పన్నగేంద్ర ॥ గీ॥ పూర్వక వుల నెల్ల పూర్ణభక్తి వలంతు । నిప్పుడున్న వారిగొప్పఁజేతు । కుకవి గణముపైన గుకునిల్వ దెన్నడు। సుఖము నొసగిబ్రోవు సుబ్బరాయ॥

సీ॥ శ్రీవసుంధరను ప్రసిద్ధిగా భరియింప నేదేవునకు జెల్లు నీకుగాక । బలిసద్మమునను దోర్బలశక్తి నివశింప నేదేవునకు జెల్లు నీకుగాక । పద్మనాభునకు తల్పంబౌచు ప్రబలంగ నేదేవునకు జెల్లు నీకుగాక । శశిశేఖరునకు భూషణరీతి వెలుగంగ నేదేవునకు జెల్లు నీకుగాక । నీవె భూమికాదిదేవుండవుమదీయ । గృహనివాసవేల్పువిహామునందు । నన్నుకరుణఁజూచి ననవతంబును । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ॥ గీ॥ యిష్టదైవపనుతి నిటులగావించిసం । సారసౌఖ్యధర్మవముదయమున । కొన్నిబయలుపరతు గురుకృపకదు ప్రేమ । నన్నుకరుణనేలు పన్నగేంద్ర.

## గురూపదేశము.

సీ॥ శ్రీగురుప్రభువరాశివరామహాముని గిరినాపభవనాశపరమకరుణ । చాలసంసారసౌఖ్యధర్మంబులు నెరిగింపుచనమున్ను గిరితనయకు । భవుడు ప్రసాదింపబడిన యంశంబులు వాచ్యాయనాధులు వ్రాసినగతి । శేషమహాసేంద్రుని చేకొన్నిధర్మముల్ వినియుందు ప్రకృతికనుసరింప । బడినఘాటలవియు బ్రహ్మపదంబందు । పరమనిష్టపరుల పనులుగావు । వాటిదెలిసిపరమపదధర్ములయందు సుఖముగాంచుమనియె సుబ్బరాయ॥ కం॥ గురుడిట్లనెధరలో స్త్రీపురుషులకన్యోన్యమైత్రి పుత్రార్జనమున్ । వరసంసారికిభూషణకరమనెన్ కరుణఁజూడు ఖగరాడ్వైరీ॥ గీ॥ పుత్రుడుద్భవింపభువిపితృగురుదైవ । ఋణవిముక్తిగలుగు వృధివియందు । పుణ్యలోకపదవిపొడగాంతురందున । వినుమనియెభుజంగవీరవర్య॥

## పురుషవర్తనము.

సీ॥ పురుషవర్తనయొక్క పోషణనెటిగింతు పుట్టిననైదేండ్లుభోగముండ । వలెనుపైనపదేండ్లు పట్టుగావిద్యల నభ్యసింపగదగు నందుమీద । పదివత్సరంబులు పృథివినికష్టించి ధనముసంపాదింప దగునుమరియు । పంచవింశతిపైన పత్నిసౌఖ్యంబపేక్షించగవలయు నుయోంచిజూడ । కాంతసుఖమునందు ఘనుడేవండైనను । కామ్యశాస్త్రివిషయక్రమముదెలిసి । యనుభవింపవలయుననెను మహాత్ముండు । సుఖము నొసగుయయ్య సుబ్బరాయ॥ సీ॥ పరస్త్రీనితల్లిగా భావింపవలయును పరధనంబులకాసపడుటదగదు । పరయింటికలిమికేర్పగరాదు భువిలోనపరులను నిందించపాడిగాదు । పదిమంది యున్నసభకుబోవగరాదు దలపనబద్ధంబు బలుకరాదు । పరకాంత యింటికి పురుషుం పులేనట్టి సమయంబుననుబోవజల్లదెపుడు । తల్లిదండ్రిగురువృద్దినంబులందున । భక్తిమరువరాదుభార్యకాత్మ । గతముదెలియజేయ తికెక్కదనిజెప్పె జూడునన్నుకరుణ సుబ్బరాయ॥ సీ॥ దుర్మార్గవృత్తులు దొరియంగవలయును జీవహింస నెపుడు జేయదగదు । తలదీయుకార్యంబు లిలజనించినగాని తప్పుసాక్ష్యముబల్కదగదు జూడ । కూడుగుడ్డయులేక కూలుచున్నను గాని దొంగవృత్తినివీడ దొరక్కవలయు । కామంబధికరించి కన్నులగప్పిన జారత్వమునువీడచాలమేలు । అధికధనముదెచ్చి యెసగుబోసినగాని । జూదమాడరాదు సుగుణమతుల । కరయవేశ్యకూట మరువుగాదనిజెప్పె । నిందుసుఖమొసంగు కుండలేంద్ర॥

## పరస్త్రీగమననిషేధవర్ణము.

సీ॥ గుణవంతురాలైన కులవధూటియున్నుండ పొరిగింటికరిగి తక్కైదిరుగువాని । పరిచర్యలొనరించు భామినీమణియుండ పరకాంత పాదముల్ బట్టువాని । యిష్టమెల్లనుదీర్చు యిల్లాలుయుండగా

భ్రష్టసుఖంబుకై భ్రమయువాని । సరసంపుకేళికి స్వగృహంబుం డగా నతియసహ్యముల పొర్లాడువాని ॥ యిట్టివానినిభగవంతు డెల్లుబోరిచు । పట్టిపడదోరియు నరకకూపంబునందు । సృష్టియం ద యనినమ్ముచు సాధువృత్తి । నాచరింపంగదగునని నాదిశేషా ॥

సీ॥ పరభామినులకాసపడిన మానవునకు పరువుప్రతిష్ఠలు దక్కు నెయుండు । నన్యకాంతనుపొంద నభిలషించంగనే పదిమందిలోబ లుచు పలచదనము । పరసతికూటంబు పాతకంబతిముఖ్య- మతిబుద్ధి చాంచల్య మతిభయంబు । యితరాంగనాశోకంబు గతికిదూరము దా ని పతిజూచినటులైన ప్రాణహాని ॥ యిల్లంట్లు నయము యిహ మునకుబహుజాస్తి జూతమనినగాని సుఖమునున్న । గాకజారవృత్తి కలనైనగమనింప । దగదటంచుబలికె తిక్కేంద్ర ॥ గీ॥ యిట్టులబ దుకుమ మానవుడిందుమీద । తనుసంసారసుఖముస కనుగుణవతి నెనకబోయెడి సమయంబు నెరుగవలయు । ననుమతి దెల్పె కృ పతోడ ఫణివరేణ్యా ॥

## ప్రయాణవిషయము.

ప్రయాణవిషయంబున ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౪-౧౫ యుం తిథులున్ను ౨-౪-౬ యీవారములున్ను శుభప్రదము । తూర్పుదిక్కునకు ౨-౭ దక్షిణమునకు ౫ ఆగ్నేయమునకు ౫-౭ నైఋతికి ౨-౬ పశ్చిమమునకు ౧-౬ వాయవ్యదిక్కునకు ౧-౭ ఉత్తరమునకు ౩-౪ యీసాన్యమునకు ౪ యీవారములు శూలలుగావున నయోగ్యంబులు.

తిదిశూలలు—తూర్పునకు ౧-౯ ఆగ్నేయమునకు ౩-౧౧ దక్షిణమునకు ౧౩-౫ నైఋతికి ౪-౧౨ పశ్చిమమునకు ౧౩-౬-౧౪ వాయవ్యమునకు ౧౫-౭ ఉత్తరమునకు ౨-౧౦ యీసాన్యమునకు ౩౦-౮ యీతిథులుశూలలు.

తిథివారశూలలు—ద్వితీయ మంగళవారము, తృతీయ శుక్రవారము, చతుర్థి భానువారము, పంచమి గురువారము, షష్ఠి శనివారము, సప్తమి సోమవారము, అష్టమి గురువారము, యీరోజులు ప్రయాణాయోగ్యంబులు.

నక్షత్రములు—అశ్వ అనూ హ మూ ధ మృ రే పుష్య శ్ర పున ఈనక్షత్రంబు లుత్తమములు. రో ఉ-భా ఉ ఇవి మధ్యమంబులు. తక్కినవి అధమంబులు.

నక్షత్రశూలలు—తూర్పునకు ధని జ్యేలు, దక్షిణమునకు అశ్వి. శ్రలు, పడమరకు రో పుబ్బలును, ఉత్తరమునకు హ ఫల్గుణులును శూలలు.

లగ్నములు—క సిం తు ధ లుత్తమంబులు, మరియు మి కన్యలయందు స్త్రీలకొనుటకును మే తు సిం మ వృ లందు పశువులు కొనుటకున్ను, కటక మీ మ కుం ములయందు ద్రవ్యమార్జించుటకున్ను, సిం ధను మే వృ ములయందు జయముగొనుటయందును ప్రశస్తము.

శూలఘటికా ప్రమాణము.

ఆది శుక్రవారములయందు ౧౫ ఘడియలున్ను, సోమ శని వారములందు ౮ ఘడియలున్ను, మంగళ బుధవారంబుల ౧౨ ఘడియలున్ను, గురువారమున ౨౦ ఘడియలున్ను, దోషకాలం తూర్పునకు పెరుగు, దక్షిణమునకు నూనె, పడమరకు బెల్లము, ఉత్తరమునకు పాలు. దోషఘడియలనంతరము దానమిచ్చిన దోషహరము. తూర్పునకు భోజనానంతరము, దక్షిణమున కస్తమయసమయంబును, పడమర కర్ధరాత్రంబును, ఉత్తరంబున కుదయంబును, పయనంబు జేసిన శుభస్కరము.

తారాబలము.

గీ॥ జననతారమొదలు జనదగుదినతార । వరకు లెక్కబెట్టవచ్చు

సంఖ్య । బట్టితొమ్మిదింట భాగింపవలెనని। జెప్పెగురువరుండు సప్పరాజ ॥ కం॥ సమసంఖ్య శేషమైనన్ । యమితంబైనట్టి శుభము సంధించును శే । షము సున్నయైనసత్ఫల । క్రమమీయదని జెప్పెగురుడు కద్రువపుత్రా ॥

## చంద్రబలము.

సీ॥ చంద్రబలంబునే శంకరుకృపచేత జెప్పబూనితినింక జనులు మెచ్చ । రాసులందునజన్మ రాసిమొదలిడ్జేసి పదిపదకొండింట పట్టుగాను । నొంటనారింట మూడింట నేడింటను చంద్రుడుండిన మేలు జరుగుచుండు । సరివితో నొక్క పటిమాన రెంటను తొమ్మిదింట నైదింటుంటనంటు శుభము ॥ జన్మాదిపక్షమందు బలపక్షనాల్గింట । నెనిమిదింటనున్న ఘనమటంచు । నెల పెరుగుచుపుండు దివ్యవిగ్రహునన్ను । కరుణనేలుమయ్య భగవరా । గీ॥ ఇట్లుపొగిపిమగియు నిలలోనశకునప । రీక్షజేయదగును తెలియుమా [illegible] మంచు దయతోడనిటుబల్కె । దక్షపుత్రీప్రియాత్మ [illegible] ॥

## శకునపరీక్షా విషయము.

కం॥ తనకెదుట నెవరు యేడి। క్ష్యన్నెవరను మమ్మెరిని కోరగ తో నాడి । శకునుగూర్చి ఫలము దెల్పుమా । గనుమని పల్కెను సుబ్బరాయ కారుణ్యనిధీ ॥

ఆదివారఫలము—ఈవారముయొక్క మొదటిజామున ఆగ్నేయము పడమర వినబడుతుమ్ము చెడును కలిగించును - రెండవజామున ఆగ్నేయము నైఋతి వాయవ్యముల వినబడు తుమ్ము హానికరము - మూడవజామున దక్షిణ పశ్చిమముల వినబడినమేలు గలుగును - నాల్గవజామున తూర్పు పడమరలవినబడిన మేలునిచ్చును.

సోమవారఫలము—ఈవారముయొక్క మొదటిజామున ఆ

గ్నేయము నైఋతి వాయవ్యదిశల వినబడుతున్ను చేటుకరము - రెండవజామున మూలదిశల వినబడుతున్ను శుభకరము - మూడవజామున ఆగ్నేయపశ్చిమముల వినబడిన శుభకరము - నాల్గవ జామున తూర్పు ఆగ్నేయ నైఋతుల వినబడిన చేటుకలుగును.

మంగళవారఫలము—ఈవారము యొక్క మొదటిజామున పూర్వ పశ్చిమ దక్షిణోత్తరముల వినబడుతున్ను మిక్కిలి శ్రేష్ఠము - రెండవజామున తూర్పు ఆగ్నేయము పడమర ఉత్తరం వినబడిన మంచిది - మూడవజామున దక్షిణ పశ్చిమాగ్నేయోత్తరంబుల వినబడిన శ్రేష్ఠము - నాల్గవజామున ఆగ్నేయ నైఋతి వాయవ్యదిశల వినబడిన శుభము.

బుధవారఫలము—ఈవారంబున మొదటిజామున తూర్పు దక్షిణ పశ్చిమముల తున్ను వినబడిన మేలునిచ్చును - రెండవజామున నైఋతి వాయవ్య యీశాన్యంబుల వినబడిన మంచిది - మూడవజామున ఆగ్నేయము నైఋతి యీశాన్యంబుల వినబడిన చేటు - నాల్గవజామున ఆగ్నేయము నైఋతి ఉత్తరముల వినినతున్ను శ్రేష్ఠము.

గురువారఫలము—ఈవారమునందు మొదటిజామున నాలుదిక్కుల వినబడుతున్ను చేటునిచ్చును - రెండవజామున దక్షిణోత్తర పశ్చిమముల వినబడునది చెడు నిచ్చును - మూడవజామున నైఋతి యీశాన్య వాయవ్యంబుల వినినయెడల పోగూడదు - నాల్గవజామున తూర్పు యీశాన్యంబుల చేటు.

శుక్రవారఫలము—ఈవారము మొదటిజామున దక్షిణ యీశాన్య నైఋతి దిశలవినబడుతున్ను పనికిరాదు - రెండవజామున తూర్పు ఆగ్నేయము దక్షిణ యీశాన్యంబుల వినబడిన కూడదు - మూడవజామున దక్షిణోత్తర యీశాన్యంబుల శుభకరము - నా

ల్గవజామున ఆగ్నేయ పశ్చిమ యీశాన్యంబుల మేలు.

శనివారఫలము—ఈవారము మొదటిజామున ఆగ్నేయ పశ్చిమ యీశాన్యంబుల వినబడుచున్న కార్యభంగము - రెండవజామున నైఋతిదిశ వినబడిన భంగము - మూడవజామున దక్షిణ పశ్చిమ నైఋతి దిశలచేటు - నాల్గవజామున ఆగ్నేయ దక్షిణదిశల కీడు.

## గోచారఫలము.

చూచేచోల-అశ్వని, లీలూలేలో-భరణి, ఆఈఉఏ-కృత్తిక, ఓవావీవు-రోహిణి, వేవోకాకి-మృగశిర, కూఘంజఛ్ఛ-ఆరుద్ర, కేకోహాహి-పునర్వసు, హూహేహోడా-పుష్యమి, డీడూడేడో ఆశ్లేష, మామీమూమే-మఖ, మోటాటీటూ-పుబ్బ, టేటోపాపి ఉత్తర, పూషాణ్ణాఢ-హస్త, పేపోరారి-చిత్త, రూరేరోత-స్వాతి, తీతూతేతో-విశాఖ, నానీనూనే-అనూరాధ, నోయాయీయూ జ్యేష్ఠ, యేయోబాబి-మూల, బూధాఫాఢ-పూర్వాషాఢ, బేబోజాజి-ఉత్తరాషాఢ, జూజేజోగ-అభిజిత్తు, ఖిఖూఖేఖో-శ్రవణం గాగీగూగే-ధనిష్ట, గోసాసీసు-శతభిషం, సేసోదాది-పూర్వాభాద్ర దుఝంథా-ఉత్తరాభాద్ర, దేదోచాచి-రేవతి. గనుక నక్షత్రమునకు నాలుగుపాదములు యిట్టిపాదములు తొమ్మిదైన నొక్క రాశియని తెలుసుకునేది అనగా ఉదాహరణము అశ్వని భరణి కృత్తికాపాదం మేషం, కృత్తికాస్త్రియః రోహిణి మృగశిరార్థం వృషభం అని యీప్రకారం చూడగా తననక్షత్రం గలరాశి యేది యగుచున్నదో అదిజన్మరాశి అట్టిరాశి మొదలు పండ్రెండు రాసులయందు సూర్యాది నవగ్రహములలో యేగ్రహ మేస్థానమున యందుండునో ఆయాగ్రహఫలితము ముఖ్యము విచారింపవల

సీ॥ సూర్యుండు కుజుడు మూడారును పదకొండు రాసులందుం డిన వాసిని మ। చంద్రుండు మూడొంట పష్టసప్తములదశేమేక దశముల వసరిశుభము । సౌమ్యుండు భువిలోన సమరాసులందున్న శుభమిచ్చుచుండును సూటిమీర । గురులైదు రెండేడిటరయతో మ్మిది పదకొండంటనుండిన దండిశుభుడు । కవిరసగిరిరుద్రగజముల నంటగా నశుభకరుండనను గడిమి । శనియు రాహు కేతు పని బూని దినకర । కుజులు యిచ్చుఫలము గూర్పగలరు । గనుక నిట్లు దెలియ ఘనులం కురని బల్కె । బహుళసుఖమొసంగు పవనభక్ష ॥

సీ॥ ఒకరాసి నెలయుండు నెప్పగా సూర్యుండు బుధభార్గవులు మరి భూమిజుండు। నెల మీఁద నరయుండు నిర్జరాచార్యుండు సంవత్సరం బుండు సరపితోడ । పదిజాములుండును బరువడి చంద్రుండు ముప్పది నెలలుండు మునమునశని । రాహు కేతులెలమి రాసులం దిరువడి । నెలలవరకు యుండగలరు యిటుల । దెలిసినదు వవలెను గ్రమంశులనిబల్కె । కరుణజూడుమయ్య ఖగవరారి ॥

## జంతుశకునములు.

సీ॥ దారిసాగెడువేళ మార్గంబులో దృశ్యములగల ఫలితంబు తెలియవలయు । గరుడభారాద్వాజ గనడేగ బుప్పి ముంగిస గుడ్లగూబలు నసుధమరియు । ఉడుత పిచ్చుకయు బల్లి యొడపక శునకములు కుడినుంచి యెడమకు నడువ నశుభము । నెమలిచిల్కయు మహిషములు గోవులు నక్కలును కాకులును గాంచననువుగాను । యెడమదిక్కనుండి కుడికేగినను మేలు అన్నంబు పాల్పెరుగన్నిలంజ । కన్నెగొడుగు చెఱుకు కల్లు తేనె నెద్దుగు । ప్రేమసువాసినీలు సుమఫలములు । యిట్టివస్తుసమితి యెదురైన మేలని । జెప్పెగురువరుండు సర్పరాజ॥ గీ॥ ఒంటితుమ్ము చేటు నొనరరప్పించును। జం

టతుమ్మమంచినంటజేయు । తుమ్మిదగ్గనేని దోషించుశుభమును । గనుమటంచుబలికె ఫణివరేణ్య. కం॥ తలదాకుట యిలగోకుట । బలుచీమట గొణుగు ఊడ్వబడుటదరలుటల్ । దలపడితుమ్ముటలివి యును । గలిగినచో కార్యభంగ కరమనెనధిపా. గీ॥ యిటులగని పెట్టుచునుచని యిందుముఖని । శుభదినంబున నీక్షించి శుభకరంబులైనచిహ్నములనుజూడ బూనవలయు । నవియునెట్లన్న దెల్పెద ననఘణేంద్ర.

బల్లిపాటు.

సీసమాల॥ పడినత్తివైరంబు నదిగాక రోగంబు పెకతల భ్రాంతృలకడనుకీడు । తలమీఁద మేనమామల గండమునవచ్చు తలకుముందుగనైతె తనకుకీడు । తలముసుకపైకీడు గలుగుస్త్రీలకు గండమమరు శిఖనువివాహము బలంగు । అటులేక తక్కిష్టమైనవారితో భోగమును కొనవెంట్రుక గ్రమతముముఖము । ననుబంధువర్శనంబునగు నటులేక బంధువివాహంబు బడయునగును । అదిగాకపోయిన నధికారిమన్ననగలుగు దక్షిణచెక్కు ఘనమునిచ్చు । నాండవారికి కీడు యశమునైనటు యిటుకుడికంట మంచిది యడమచెడ్డ । ముక్కుపైరోగంబు ముక్కుకొనను ఫీడ ముక్కుక్రిందను హాని ముక్కుకెడమ । శుభమునొష్ట ధనంబు జూడగా కుడిచెవ్వ మేలెడమను హానిచాలగల్గు । కుడికనుబొమమేలు యెడమను కీడౌను వశమిని శుభమిచ్చు నెడమమీఁద । మాఁకీర్తి ధనలాభమును కుడికీడౌను క్రిందిపెదవిమీఁద యింపుభోజ । నము పైనిరాజభయము గడ్డమున మేలు కంఠమందున కల్మిగలుగు నిజము । మెడను సంతానంబు యెడమను వాహనలాభంబు శత్రునాశంబు కుడిని । యెడమభుజంబున కడురోగమొనరించు కుడి జయంబును దె

చ్చు పుడముభోగ। మెడమునందిటనైన కుడినిసోదరులకు గండమా
వడిరొమ్మున్గడుసు ఫీడ । యెడమచంటిన లాభమిడు పుత్రశోకంబు
కుడిచంటిపైబడ్డ గూడవలయు। చనుమొనపై మేలు చలగుపొట్ట
నునైతె భాగ్యంబుబొడ్డుపై బాగులేదు । పొత్తికడుపున ప్రాణ
మెత్తునుయట్లు లేకున్న దారిద్రమై చెన్నుమీరు । చతురతనెడ
ము మోచేతిగు టను బడ్డ ధనమెచ్చు కుడి దుఃఖమున జలంగు
ముంజేతులకు మేలుబొసగించు మణికట్ల కష్ఠంబుగలుగును ఘన
ముగాను । మీజేతులను లాభమిచ్చును యెరచెయ్యి నెడము ద
రిద్రమూ కుడినమేలు । చేతివేళ్లను మేలుచే కొనగోళ్లన కుడిచే
త జగడంబు నెడము మేలు । పృష్టభాగము మేలు బొడములింగము
నందు దారిద్రదశయౌను ధరణిలోన । జానుజంఘులను ప్రయా
ణంబు నూగువులంద రిష్టంబగు లాలితముగ । పాదముల ప్రయా
ణ పద్ధతిజరుగును । యిట్లుగౌళిపాటు నేర్పరించి । ఫలము దెలు
పుమంచు బలికెనుకదుప్రేమ । సుఖమొసంగిబోవు సుబ్బరాయ.

## స్త్రీదేహాభివర్ణనము.

సీ॥ స్త్రీలనిదానంబు జెప్పుదుపాదముల్ పాదుకగతినున్న పతిని
జంపు । కాలికికడవేళ్లు నేలనానకయున్న జారిణియనవచ్చు సహ
జముగను । సడకశబ్దముగల కడుకొద్ది వ్రేళ్లది పతికిదుఃఖము దెచ్చు
ప్రబలముగను । పిక్కలందెంట్రుకల్ మిక్కటంబుగనున్న చేటు
భర్తకటంచు జెప్పవచ్చు । తొడలభుజంబుల వడి వెంట్రుకలుయు
న్న జారత్వచోరత్వ జాడదెల్పు । పిరుదులముఖము లభగితమా
నుడియున్న బహుళమాస్త్రీనిగా బలుకబడును । మీసంబులున్న
ను దుస్స్వభావికయగు కంఠంబుకురుచైన కొంతునణచు । మెడని
డివైనను దడయపుట్టింటికి హానిగల్గించును మానితముగ । కను

లు మిసకరింతగల దతిజారిణౌ పండ్లు నెడలై న పతినిగేరు । నిడు పు పండ్లైనను కడువడి కలహించు కంఠమందునసుడి కాంతు జంపు । మెఱుపుపచ్చ నురటవెం డుకలై రెప్ప । లందునెగడ ధరణి యందు మిగుల। ధనవిహీనురాలు దలపోయనగునని। సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. కం॥ యిటువంటిస్త్రీలనదలుచు । స్ఫుటతర శుభచిహ్నములను జూపట్టుస్త్రీ । ఘటియించునెడ వివాహము । తటుకునభువియందు జరుపదగునని సుగుణా.

## సత్కన్యాలక్షణము.

కం॥ దలపగ జలజసుగంధము । గలమేనితొ నొప్పబడుచు కరపల్లవముల్ । గలిగిదవళ వస్త్రేచ్ఛయు । గలుగుందివివాహయోగ్యకరమనెనధిపా॥ సీ॥ దేహంబుబంగారు దీప్తితోనున్నను నీలమేఘంబుతో నెగడుచున్న । కాళ్లు చేతులు గోళ్లు కనుగొల్కులివి జూడ నెరుపుతో మృదువుతో బరుగుచున్న । వరముగా కొద్దినిద్రాభోజనములతో పలచనౌముఖ గర్భములతోనున్న । మధుకరంబుల దర్పమణగించు కురులతో మిగుల శీలముతోటిమెలగుచున్న । శంఖచక్రాదిరేఖలు చరణకరము । లందుగన్పట్టు చుండెడు కుందరదన । లందుభ్రమనొంది సంసారమందుమిగుల । దక్షతగనుంచదగునని తక్షకవర. సీ॥ పూర్ణచంద్రుహసించు మోమును బాణనములనెన్ను వాలుగన్నులనుయడ్డ । ములమాపు జేయు చెక్కులను శ్రీకాగంబు బరిహరించెటి కర్ణవైఖరియును । తిలప్రసూనంబును బోలుపొక్కు నాసికమును పాటలముదీప్తి నణచుమోవి । యనుశంఖమును బోరిగొను కంఠమును కీరవర్గంబు నోగొత్త బడనిపల్కు । లుసునిమ్మపండ్ల యవ్వనమొంచు కుచయుగ్మమునుసింహముకు సిగ్గుబొడము నడుము। పద్మపత్రము నెన్నబడు

మరుసదనంబు యుసుకదిన్నెల భ్రమియించు పిరుదు। లున్నరాజ హంసలుగువడి తలవంచి। నగగుహాళివడగు నడకలున్న। గలిగియున్న స్త్రీని గనివివాహప్రియ। త్నము నొనర్పవలయును ఫణీంద్ర. గీ॥ గొప్పచన్నులు కర్ణముల్ కోలముఖము। కాళ్లుచేతులు గోమముల్ కఠినపల్కు। లరుగుజారిన పండ్లుండు గరితలవని। పెండ్లికిని యొప్పదనెను దక్షికరేంద్ర. కం॥ ఈలాటియంశపుంజము। చాలాగని పరిణయంబు సల్పగవలయుఁ। యేలాదడవ్రు ముహూర్తపు। చాలుగనుంకనుచుబలికె సాహప్రఫణా.

వివాహవిషయము.

.౨-౩-౫-౧౧-౧౨ వృత్తనుము, ౮-౯ మధ్యమము, యీమాసములయందున్ను, ౧-౩-౬-౮-౧౧-౧౨ శుక్లపక్షమున యీతిథులుతప్ప తక్కిన తిథులున్ను, కృష్ణపక్షములో ౨-౫-౭-౪-౯-౧౦ యీతిథులున్ను వివాహమునకు ప్రశస్తము. మూల, అనూ, మృగ, రో, హ, రే, స్వా, మ, ఉత్తరాత్రయము ఈనక్షత్రములున్ను సో, బు, గు, శు యీవారములున్ను మేలునిచ్చును. వివాహలగ్నమునకు కుజుడు ౮ దోస్థానమునన్ను కుజాష్టమదోషము శుక్రుండారింటనున్న భృగుషట్కదోషము చంద్రుడు ౬, ౮ ౧౨ యీస్థానములనున్న షష్టాష్టమద్వాదశ చంద్రదోషము గనుక అట్టిలగ్నములు పనికిరావు వివాహలగ్నమునకు ౭ వస్థానమందు పగ్రహములున్నను జామిత్రదోషమనబడును అట్టిస్థానమందు పూర్ణచంద్ర బు, గు, శుక్రులున్నయెడ దోషములేదని కొందరు, లగ్నమునకు ౧-౪-౭-౧౦-౧౧-౨-౫-౯ యీస్థానముల బుధ గురు శుక్రులున్నయెడ శుభము, ౩-౬-౧౧ యీస్థానములందు శ-రా ర-కు-కే వీరలుండిన మేలు, స్త్రీ మూలయందు జనించిన మా

మఖను ఆశ్లేషలో జన్మించిన అత్తకును జ్యేష్ఠలో జన్మించిన జ్యేష్ఠభ్రాతకును విశాఖలో జన్మించి మరదికిని హానికరము జేయును
సీ॥ దలపనీలాటివిషయముల్ దెలిసిభువిని। శుభముహూర్తంబు గనిపించి సుందరాంగి। మైనస్త్రీని వివాహంబు తానిచేత। నొందనగునంచుబల్కె ఫణీంద్రధరుడు.
చం॥ ఇటులవివాహమంది విభుడింపుజ్వలింపగ మర్లుబెండ్లికిన్। నటభట బంధువర్గము ఘనంబునదర్లధరిత్రినిండగన్। స్ఫుటతరశోభనాకృతిని సొంపలరారెడు దివ్యగేహము। కటకటి ఘటించుంపమేలనియె గాడ్పును నాపడు దేవప్రేమతోన్.

## గృహనిర్మాణశంకుస్థాపనము.

శేషార్థము—భక్తాగ్రణీవినుము. శంకుస్థాపమునకు. మాఘ, పాల్గుణ, వైశాఖ, మార్గశిర, కార్తిక, శ్రావణమాసములు శ్రేష్ఠములు. ఆదివారము గృహారంభము అరిష్టము, [illegible]. సోమవారము కలహము. మంగళవారము సంతానసష్టము. బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠములు. హ, అశ్వ, శ్ర, ధ, రే, ఉత్తరాత్రయము, రో, చి, అనూ, పున, పు, మృ. యీనక్షత్రములు శంఖుస్థాపనకు శ్రేష్ఠములు. 3-6-11 యీలగ్నస్థానముల యందు పాపగ్రహములున్న, లగ్నమునకు, 1-4-5-7-9-10 యీస్థానములయందు శుభగ్రహంబులుండిన మంచిగలుగును. పాపగ్రహంబులు ౮వ స్థానమందున్నయెడల కర్తనునశింపజేయును.

## గృహప్రవేశము.

గృహప్రవేశమునకు, హ, పు, పున, శ, స్వా, రే, రో, ఉత్తరాత్రయము. అనూ, శ్ర, మృ, మూ, ధ, అశ్వ, యీనక్షత్రములున్న. కన్య, కుంభ, వృష, వృశ్చి, సింహ, మిధునములలోనున్న. గురు, శని, బుధ, సోమ, శుక్ర, వారములున్న, శ్రేష్ఠతమములు.

## ద్వారబంధవిషయము.

నక్షత్రములలో, రో, మృ ఉ, పు, పున, హస్త, చి, స్వా, అనూ, జ్యే, శ్ర, ధ, రే, అశ్వ, యీనక్షత్రములున్ను. వృషభ, సిం, వృశ్చి, కుంభ, తులాలగ్నములున్ను. లగ్నమునకు, ౧-౪-౫ ౭-౯-౧౦ యీస్థానములందు బుధ గురు శుక్రులున్ను, ౩-౬-౧౧ స్థానముల పాపగ్రహములున్ను మూఢములు లేకయున్న సమయములయందు ద్వారబంధస్థాపనము చేయవలెనది. మి, కన్య, ధ, మీనలగ్నములయందు తలుపుయెత్తవలెనది.

## పంచకరహితము.

నిశ్చయించిన లగ్నసమయమునకు శుద్ధపాడ్యమి మొదలు ఆరోజు తిథివరకున్ను ఆదివారము మొదలు ఆవారమువరకున్ను అశ్వని మొదలు ఆనక్షత్రమువరకున్ను మేషము మొదలు ఆలగ్నమువరకున్ను లెక్కించి ఆమొత్తమును తొమ్మిదింట భాగింపగా ౧ మిగిలిన మృత్యువు ౨ మిగిలిన వహ్ని ౪ మిగిలిన రాజపంచకం ౬ మిగిలిన చోరపంచకం ౮ మిగిలిన వసుపంచకం యీపంచకములు కూడవు తక్కిన ౩-౫-౭-౯ యివి యనుకూలము.

## నూతనవధూగృహప్రవేశము.

నక్షత్రములలో రే, అశ్వ, శ్ర, ధ, రో, మృ, హ, చిత్త, స్వా, మూ, మ, ఉత్తరాత్రయము పు, అనూ, యీనక్షత్రములయందును తిథులలో ౮-౯-౧౪ యీతిథులుగాక తక్కిన తిథులయందును వారములలో సో, బు, గు, శు, శని వారములయందును నూతనవధూగృహప్రవేశము ముఖ్యము.

## కూపారంభము.

భావి తనయింటికి యీశాన్యము తూర్పు పడమర వృత్తము

భక్షణం । బొసర్భ్భవలయుననుచు చెర్చరవినబల్కె । సుఖము నొస
గుమయ్య. సుబ్బరాయ. సీ॥ యెవరైనపురుషుండు యెమరేగి భా
షింప తలయెత్తిమాట్లాడ దగదుజూడ । వరకాంతలతోపొందు వ
తియొనర్చినగాని గికురింపజెల్లదు ప్రకటితముగ । చవతిపై కలహం
బు సాగింపనెల్లదు పతికేసుమునుగోర వలయుఘనత । పతిజయం
బును గోర్చి భామినిదైవప్రార్థన నీమనిష్ఠలదనియువలయు । పతి
యనుజ్ఞనలస బరువడిసతిధియ । భ్యాగతులకు దానప్రచయముల
ను । యిచ్చెనగునటంచు విబుధులువినబల్కె । సుఖమొసంగిబోరి
వు సుబ్బరాయ. క॥ ఇవ్విధమునకుటిలాలక । జన్మమున జరు
పుటకును చాలనీతిత్ । యివ్వసుధగరపనగురుతు । నవ్వక నెరు
సంతుననియె నాగాస్రష్ట గా.

## స్త్రీలఋతువిషయము.

సీ॥ సతిరజస్వలనెన్న చైత్రముపతినెంచు వైశాఖమందైన వ
చ్చుకలిమి । జ్యేష్ఠమందైనను క్షితిపుత్రలాభంబు యాషాఢము స
దాంగదానుదలప । శ్రావణంబున పెళ్ళసౌభాగ్యమొసగూడు
భాద్రపదంబున బహుళసుఖము । ఆశ్వయుజంబున నధముదాలై
మొప్పు కార్తికంబున కోపకాంతయగును । మార్గశీర్షంబున మం
చిసంతానంబు పుష్యమాసంబైన పుణ్యవతియు । దలపమాఘమై
న ద్రవ్యంబుచేకూరు । పాల్గుణంబునందు బహుయుభాగ్య । నార్తి
జాలకు నాయునధికమానానిబల్కె । సుఖమొసంగుమయ్య సుబ్బరా
య. సీ॥ పాడ్యమినాడైన పాపిష్ఠయైవర్తించు విధియుభాగ్యశాలిష్వి
తీవినొప్పు । తదియపుత్రసమృద్ధి దిలపోయుచవితిని పంపుష్పుల
గోరు గరితయగును । పంచమిబునుగుణములు ప్రాప్తించుచుండినొప్పు
షష్ఠికలహాకారి సాహసమతి । సప్తమియందైన సంతానవతియగు

బులయంకు సపేక్షదేహముష్ణత్వముస । త్ఫలమభిమానవిహీనము।
గలస్త్రీని పిశాచసత్వక్రమమనెనధిపా. సీ॥ చపలంపుచూపులు
చంచలహృదయంబు మాంసమందిచ్ఛవాయసమునకును । చపల
దృష్టియు నఖక్షతదంతక్షతములు అరవడంబుండు వానరమునకును ।
ప్రియవాక్యములచేత ప్రియుసెంచునదిగాను గార్ధభసత్వంబు గ
ణుకెక్కె । కుచములుపిసులు గొప్పకూరికఫుగూపు గలది కూ
ర్మంబుగా దెలియదగును । తిప్పటయుజాస్త్రీ యవివేకమొప్పచుం
డు । భ్రాంతిమొక్కటమాము గన్పట్టుసుదతి । పర్యటనసత్వయను
పేరు ప్రబలునంచు । దెలియబల్కెను ఘనవ్యాళకులమృగాంక.
గీ॥ యిట్లుసాముద్రికాపులందెన్నబడిన । చిహ్నధర్మములనుగాం
చి కన్నెయతిప । విత్రమైనదియనిదోచవేట్కమీరు । పెండ్లియా
డంగదగునని బిలనివాస. సీ॥ పతివ్రతధర్మంబు పాలింపబడుస్త్రీ
ని హిమశైలతనయగా నెన్నబడును । సద్గుణంబులుగలసతి యె
వ్వరైనను కదలికూతురటంచు గణుకెక్కె । సుగ్గాఢమతియైన
సుందరాంగినిజూడ పరమేష్ఠిసతిసాటి బలుకవచ్చు । నవగుణంబు
లులేక సతియొప్పుగలకాంత శీతతల్లికిమారు చెన్నుమీరు । నిట్టి
సుగుణశీలు లెవనికిదగుచుండు । రతనిగృహముసందు నాటపట్టు
గానుతమ్మియింటి గరితయున్నదటంచు । జెప్పవచ్చుననియె క్షితిఫ
ణీంద్ర. సీ॥ పతులందుర్తలైన నతికురూపులునైన పరగోష్ఠి
నొల్లక బరగుస్త్రీలు । క్షితిబీదవారైన నితరచింతనలేక భిక్షమె
త్తుకవచ్చి బెట్టుస్త్రీలు । బధిరాంధకాదులు పతులౌచునొప్పిన
దైవరూపులటంచు దలచుస్త్రీలు । చవతిసంఘంబుల జతజేసినను
గాని భక్తిని పోషింప బడనిస్త్రీలు । తల్లులుగనెంచి కీర్తింపదగిన
వారు । నరకప్రాప్తికి పందివ్వనట్టివారు । పూర్ణమైనట్టి పదవిని

పొందువారు । వారలతోఁ సాటిలేరని బలికెనధిపా।

## ఆశ్రమధర్మము.

సీ॥ మానవుండగువాడు మహిఁజేయఁదగు వేద విహితకర్మంబు
లన్ వినుముశిష్య । యర్కోదయము మొదలష్టమముకలోన ష
ట్కర్మసత్క్రియ లన్నల్పవలయు । పండితులేర్పర్చబడినవర్ణాశ్రమ
పద్ధతులను వీడబుద్ధిగాను । ఘనవృషకాలంబు ననులేచితప్పక
స్నానంబుజేయంగ జనుధరిత్రి । సంధ్యవార్చనట్టి జనుదైవంబైనను।
ఎట్టికర్మజేయ నట్టికర్మ । ఫలమునీకఘోర పాతకంబంటించు ।
ననుచుబల్కెనయ్య ఫణికులేంద్ర. సీ॥ అంకుమీదట దేవతా
ర్చననొనరించి శుభకరద్రవ్యముల్ జూడవలయు । పూర్వాహ్ణమప
రాహ్ణముల దేవపితృకార్యములు సల్పందగు విమలముగను । తలి
దండ్రి గురుభార్యతనయులు దీనులు యభ్యాగతుండగ్నియతిథులం
దు। శ్రద్ధచేపోషింప జనగ్జ్ఞాతిరిన్ బంధువునిర్ధనుని యనాథ
నుధనీకు । డైనవాడు భువినిత్రాణచేపోషింప । వలయునైనవా
రు వచ్చినపుడు । దానుతినెడియన్నమైనను పంచిచ్చి । శేషమును
భుజింపజెప్పెనభవ. సీ॥ కనికరంబోర్పు త్యాగముశ్రద్ధ ఇంద్రియ
జయముకూడనిపనుల్ జేయకయును । పరవుపకార మేధగణీపిదగి
యుండవలెతనగుణము లేపసులగుణము । లనిదలంచరాదగు జను
డొకనికి జేయదగుకష్టసుఖములే తనకుచుట్టు ననియెరుంగందగు
గనసత్యవర్తన మందధికారిగా నగుపడవలె । రాత్రికాలంబున నిమ
ణానుప్రథమచాతుర్థ యామంబులువ్యర్థపడక । భగవదైక్యమైన ప
నులుసాగింపుచు । మధ్యకాలమందు మనుజులంత । నిద్రజెందన
గును భద్రంబుగానని । బలికెగురువరుండు పవనభుజ. సీ॥ మ
నుజుండు భూమిలోనను దానమొనరింప సత్పాత్రమునగని సల్పవల

యు॥ నాచార్యలక్షణం బమరినవానికి జేయుదానఫలంబు జెప్పవ
శమె । తల్లిదండ్రులులేని దౌర్భాగ్యవరుని పనయునవి వాహాదిన
యతరమగు । ఖర్మలుజరిగించు ఘనునకుఫలితంబు జెప్పుటకొకనికి
శక్యమగునె ప్రతికూలమైనట్టి భార్యగల్గినవాని దుఃఖచింతని జ
ప్పదోచబడదు । ఎంచిజూడజూడ నిద్దగుభార్యలు । గలుగువాని
యవిధికమలభవుని । తాతతాతమైన దలపోయజాలదు దెలియు
మనుచుబలికె దివ్యచరిత. సీసమాల. ఆలుమగనిమీద జాలిగా
స్వాధీనురాలుగా నాపేక్షచాలియుండ । తండ్రికన్నను ప్రేమ తను
గోయంచుంచుచు నిష్పార్ధసమితిచందించవలయు। కంటికిరెప్పను జం
టబాయనిభంగిస్త్రీమనం బరిశిరక్షింపవలయు । దేహమశక్తమై
తే । దగినౌషధశేవజేయుచుబాగు జేయవలయు । స్త్రీవధూవ
రరూపలావణ్యములు యవ్వనము సమానంబుగా నమరవలయు ।
ఆటలన్ పాటలన్ మాటలన్ వేటలన్ వనవిహారంబుల దనియవ
లయు । వీణాదిగానముల్ వివిధచిత్రకువులు వ్రాయుటచదువుట
ల్వదగవలయు । ఆలింగనముచుంబనాది బాంహ్యరతంబు ప్రేమ
నొనర్చి మెప్పించవలయు । నిటులగావింపుచున్నను ఇంతిమిగుల ।
మకులుజనియించి పతినిపమరకనుండు । నంమసత్పుత్రధనమబ్బున
నుచుజెప్పె । నిర్మలాకార సాధుమప్కర్మదూర. సీ॥ అడవా
రినిభూమి నగడుజేయగరాదు వారలతోగల్గ బడియెలోక । స
ముదాయమెల్లను సర్వజ్ఞులైనట్టి బ్రహ్మవిష్ణుమహేశ్వ రాదులం
త । నెత్తిబెట్టుకగొల్వ నేర్చునదిగాక నిష్ఠకామ్యార్థంబు లి
ష్వగలరు । కలకంఠులెంతైన కన్నీరుబెట్టిన శిరిఇంటనిల్వదు శిద్ధ
మిదియు । ఎంచిజూడస్త్రీలకే దోషములులేవు । పుణ్యమతుల
టంచు బుద్ధిదెలిశి । పలుచున్నచాల మేలుగాంచుమరని । జెప్పె

గురువరుండు శ్రీకరఘనా. సీ॥ స్త్రీలయందునుపేక్ష జేయు మం
డగరాదు జేసినసట్టి స్త్రీ చెడును పుడమి । అత్తమామలు బావలన్న
లు తలిదండ్రులమాపు లేకను ఇంటికధిపత్తెని । ఎప్పుడు పుట్టిల్లు నెప
బాయకున్నను పొరిగింటివాశిగా బరుగుచున్న । జారిణీస్త్రీలతో
సహవాసమొనరిస్ట పరపురుషవిశేష భాషలున్న । గమనుతగుపు
కెపుడు రాదీయుచున్నను । ఇంటిసొత్తు దొంగలించుచున్న । ని
ట్టివారిమతము నైష్టికబోధల । వలయునను చుబలికె వాసు
కేంద్ర. సీ॥ ఇతరస్త్రీలను నరుండీక్షించినప్పుడు తనతల్లిమాకు
గా దలచవలయు । పరకాంత చిత్రితాభరణురాలైయుండ పరమ
శ్వరిగ నెంచవలయు మదిని । పరకాంతబిలుపింప వచ్చుచున్న సమయం
బు గనిపోయిమాల్లాక ఘుంటుటండ్రు । పరపురుషులను పాంచ్రత
స్వాగలుగా భావించకను సేలు బరిగుచుండు । నిశ్చలవర్తిం ము
మానవుండీహములోన । పూజ్యతము నొంది పరమందుభూరిసౌఖ్య
పరుతుయగుసంచుబలికెను కరుణకలిగి । నన్ను నేలంగవలయును
పన్నగేంద్ర. సీ॥ పుత్రధనమునకును పోలినవస్తువు । గానబడదు
ధరణిలోననెంచు । సిదియుగాక ముదితలిచ్చు సౌఖ్యమువంటి
సౌఖ్యమొసగదనెను సర్పరాజ. వ॥ అట్లుగావున సీ॥ పతి
వ్రతయైనట్టి సతియొప్పనగువాపుజాడ్యదూరుండౌను జగతియందు
నదియెట్టులనియన్న నధరామృతము పానమందు పైత్యహరంబు సం
దుమీద । నాలింగనలచేత నమరువాతహరంబు సురతమందున శ్లే
ష్మ హారముమరియు । బాలలఘుత్వదీపనశక్తి హర్షంబునాడిసై
ర్మల్య తనమరజేయు । యవ్వనిసంచేంద్రియములకు బలమును ఘ
నత్రిదోషంబుల నణచుమందు । పౌష్టికరతంబుదీపన జ్ఞానముల ని
చ్చు వృద్ధురాలిరతంబు శుద్ధతప్పు । గానమట్లు దెలిసి మానవులందరు

వారి వారిపతులవారుగలశి । మెలగవలయుననుచు బలికెను చర
కగ్రం । థానుసారమిదియు తత్కేంద్ర. కం॥ జనులీవిధినటియిం
పుచు । తనభార్యలగూడదగిన తరివినుమంచుఁ । ప్రణుతించునటు
ల బలికెను । ఘనవ్యాలకులాబ్ధిసోమ కరమర్ధిభువిఁ.

## సంభోగసమయవర్ణనము.

సీ॥ పురుషులంమనజూడ భూరిసంభోగేచ్ఛ జనియించునందుననష్ట
జేయ । నశ్శక్తిరోగంబు నధికచాపల్యంబు మేధస్సువృద్ధియు మేహ
జాడ్య । మును దేహశిధిలత్వము నపుంసకత్వము బొసగించునటుపై
ని పుత్రభాగ్య । మొనగూడనటుగాన ననబోణులను పెండ్లియాడి
మితంబుగాగూడుచుండి । వెంటనేస్నానమొనరించి వేడుకలర ।
పాలుశర్కరగుడమును భక్ష్యములును । మాంసమునువీటి భక్షిం
ప మంచిదంచు । బాహటములోన గనుమని బలికెనభవ. సీ॥ గ
ణుతింపసంభోగమునకర్ధరాత్రి ప్రాతఃకాలమిట్టమధ్యాహ్నసంధ్య ।
వేళలొల్లవుస్త్రీలకేళిరాత్రిద్వితీయయామంబు హితమగుభూమిలో
న । రతియొనర్చినమీద రాత్రియంతయునొద్ద పండుకోగూడ దె
వ్వటికైనైన । సతులవసంతాది ఋతువులందునమూడు దినములకొ
కతూరి యనువుగ్రీష్మ । రుతువునందున దినవితముపదేనింటి ।
కొక్కతూరిస్త్రీని గూడవలయు । ననుచు జెప్పబడెను ఘనులిది విని
మెచ్చ । సుఖము నొసంగవలయు సుబ్బరాయ. సీ॥ ఇష్టంబు లేనిది
యితరునిప్రేమించి నదియాతలితోడస్సి నదియురోగ । మును జెం
దినదికోపమును బొందినదియన్న మప్పుడుదినిన దానన్యకాంత ।
లనుగూడదగదు మైధునమొనరింపను నది దేవళంబరణ్యముశ్మశాన
వాటికందునపట్టపగలందు లజ్జచెడిచోట్ల భోగించరాదు। సతు
లు కక్షగశ్రేణి స్థానము దెముగోజు । వతులుపొందకున్న బహుళోహ

త్య । సంభవించుననుచు సరసులువినబల్కె । సుఖము నొసగుమ య్య సుబ్బరాయ.

## పరవశత్వము.

సీ॥ స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి పదియందిలోనను ప సువుగలదు । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి ఇహసౌఖ్యసం తతినెన్న వశమె । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి తనయింటి లోలక్ష్మి తాండమాడు । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి పు త్రభాగ్యముచే పవిత్రతయగు । స్త్రీకియనుకూలుడైనట్టి శ్రేష్ఠున కును । ఇష్టకామార్థ్యములు ఫలియింపజేసి । కేవలానందవారిధి కీర్తివెలయ నోలలాడించుననిబల్కెవాళచంద్ర. కం॥ ఇద్దరిమన ములుయొకటై । ఒద్దికతోగలియునప్పుడొప్పెడుసుఖముఁ । యి ద్దరిని బ్రహ్మకైనను । సాధ్యముగాదంచుబలికె సాహస్రఫణా. కం॥ క్షితియందు బ్రహ్మసృష్టికి । ప్రతిసృష్టిని జేసెననెడి పద్ధతివినవే। వె తుకగవలె నావేరే । మతిమంతులటంచువల్కె మహనీయనరా.

సీ॥ అట్టిసౌఖ్యముజేసె హరిహరబ్రహ్మలఁ భూరికాంక్షవహిం చి బుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నఖిలలోకంబులఁ భూరికాంక్ష వహించి బుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నండపిండంబులఁ భూరి కాంక్షవహించిబుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నతివలపురుషులఁ భూరికాంక్షవహించిబుట్టునట్లు । నట్టియానందసుఖములో నవతరిం చు । నట్టియానందసుఖములో నుజ్వలించు। నట్టియానందసుఖము లో నడగునంచు । నఖిలమునకాది యదియంచు ననియెనభవ. గీ॥ అదెమహామూల ప్రకృతియదెయనాది । మాయయదెనిహపర ముల మాతృకయదె । యగుజన్మాయ కారిణియంతకన్న । వేఱులే దంచుబల్కెను విషధరేంద్ర. గీ॥ అదియురెండు విధంబులై యల

రుమూర్ధ్వ । యోనియనగను భువినధోయోనియనగ । నవియె బ్ర
హ్మాదులకును వారయ్యలకును । మూలమని జెప్పె భుజగేంద్ర ము
ఖ్యఘనత. సీ॥ అదెయూర్ధ్వకుండలి యిదియధోకుండలి యదియె
త్రికూటంబు యిది త్రికోణ । మదె బ్రహ్మస్థానమానిదిక ర్తస్థానమా
నది యొసగునుముక్తి యిదియుభుక్తి । నదిపరంబును జేసె నిది
యిహంబును జేసె నదియీశ్వరుని జేసె నిదియుజీవు । నదిమోక్ష
కాంతయా నిదిమనోకాంతయా నదిజేసె జ్ఞానమజ్ఞానమిదియు ।
నదిస్వచ్ఛగుంటయా నిదియిచ్ఛగుంటయా నదిజేయు నంతపనిది
యుజేసె । నందుసర్వాధికారుల నదియుజేసె । నిందుసర్వాధికారు
ల నిదియుజేసె । నట్టియోనిని నీయోనిబుట్టనయ్యె । నట్టియోనిని
నాయోనియనె ఫణీంద్ర. సీ॥ అది త్రికూటంబయ్యె నిది త్రికూ
టంబయ్యె నది బ్రహ్మస్థానంబు నిదియునదియె । అదిముక్తినిచ్చును
ఇదిముక్తినిచ్చును అదిపరమపదంబు యిదియునదియె । అదియి
హలోకంబు యిదియిహలోకంబు యదిజ్ఞానమజ్ఞాన మిదియునది
యె । అదిమోక్షకంతయానిది మోక్షకంతయా నదిజేయు నం
తపనిదియుజేయు । నదియుప్రకృతియోచింప నిదియుప్రకృతి।యుం
దెపురుషుండు యెంచదీనందె పురుషు। డందె స్త్రీయును యెంచదీ
నందె స్త్రీయు । నొప్పబడునని జెప్పెను సర్పరాజ. సీ॥ మనసధో
యోనినిమరిగి క్రీడించును యూర్ధ్వయోనికిని దృక్కుత్సహించు।
నుమనరతంబు చేసూచించు పదునాల్గు భువనముల్ దృక్ రతంబున
ను పరమ। పదము ప్రకాశించబడునట్టి రతిసుఖానందమెంతని జెప్ప
నగునుచూడ । విశ్వజాలంబులా విశ్వేశులామహదానంద వారిధి
దగిలిమిగుల । యర్లుకొనుచునుండు రాద్యంతమెరుగక । నగులుగ
దుతురన్న నగరెఘనులు । గనుక రతిసుఖంబె ఘనమంచు గురువ

రుం। డమలమతినిబల్కె నాదిశేష. కం॥ కొందరు నూర్ధ్వబిలం బును। కొందరును యధోబిలంబు కోరికదీర్ప। పొందుకొను చుందురనుచు। వసుంధరలో జెప్పెనయ్య సుబ్రహ్మణ్యా. గీ॥ పర వశత్వమందు బరిగెదుసుఖజాడ్య। చయమునకును దగినసాధకము లు। జనులు దెలిసి ధాత్రినను భవించినమేలు। నొందగలరటంచు నుడివెనధిప.

## సుఖరోగచికిత్సావిషయము.

సీ॥ సుఖవ్యాధులణగించు సురుచిరయోగంబులును దెల్పుకు ను నదిగనుమువత్స। రసములునాల్గు పీరముగంధకము సమంబు లను టెంకాయలోపలనిమిడ్చి। తేలికపుకమేసి తీసికొబ్బరితోటి మర్ధించి చనకసమానమాత్ర। సేవించిననుపూర సింధూరముల రెండు మూడేసివంతుల గూడనిచ్చి। కొంతిరొండొంతులునంటిం చి తిప్పతీగాకు రసంబునపాకపరచి। మాత్రశనగలంత మాటుకొం తిసమర్చి। తేనెలోనముంచి దిన్ననుపవ। మేహవ్రణము లణగు మేదినిలోనని। బల్కెగురువకుందు పన్నగేంద్ర. శేషార్థము॥ ౧ నారిశేఖరసాయనము ఆదిఆకాయలోని నీళ్లచేతనే నూరి తొమ్మిది రోజులు తినేది. తియ్యపత్యము. ౨ రసరాజేశ్వరం, ఇదివేరేకొం తినీళ్లతోనూరి మాటుబెట్టేది పూటకు మూడుమాత్రలవంతున ౫ రోజులు తినేది, ఇచ్ఛాపథ్యము, వెంటనే తాంబూలం వేసేది, కరక్కాయ నమలేది. సీ॥ మిశ్రమశగలకు మేదినివినిపింతు కొన్ని యోగంబులు కోర్కెలొదవ। రసవర్గములు నాల్గు వసమించు గంధక చిత్రమూలపుపొట్టు జీలకఱ్ఱ। పాళ్లుసమంబంనపాది రసం బున నూరి కుంకుడుగింజ లురువుమాత్ర। జంటలు పదిపూట లంటించి సమపథ్యముంచ రేవలదిన్ని నంచితముగు। యేలకవాము

మిర్యాలు పిప్పలిరాతినార గంధకమును పారదంబు । భాగసమము గూర్చి పట్టుమీరగనీళ్ల । నూరిపదిదినాలు నూరితీపు । చాతదినిన సర్వశగలడంగునుయనె । సుఖమొసంగిబ్రోవు సుబ్బరాయ. శే షార్థము॥ ౧ వహ్నిమూలయోగము ఇదిమాత్ర తేనెతోముంచి తినవలెను. ౨ ఇదికల్హారయోగము. సీ॥ కొరుకుజాడ్యమునకు కుంభినివినుపింతు కొన్నియోగంబులు కోర్కెలొదవ । రసపూర ముసు మరి రససింధురంబును చక్కలవంగాలు సమముచిత్ర । క మునాల్గు పాళ్లను క్రమముగమర్ధించి చణకమాత్ర ప్రమాణము ననుదిని। కొరుకుశగలడంగుమురి. ఇంగిలీకంబు జీడిగింజలగాల్చి శే షుకలర । పిప్పలిలవంగాలు ప్రియముతోమిరియాలు చూర్ణించి పైలింగ చూరగల్పి । జేషయెత్తుతేనెతోడను నేతితో । దినిన కొరుకు జాడ్యమణాగుతీపు । పథ్యమునచుదెల్పె పరమవేద్యగురుం డు । నన్నుబ్రోవవలయు పన్నగేంద్ర. శేషార్థము॥ ౧ చిత్రమూ లయోగము . ౨ యింగిలీకశింధూరము యేడేసిరోజులు సేవించేది సీ॥ అంటురోగంబుల కపుషధాలెఱిగింతు నిలనుశంకరుకృప గలు గునటుల । పసిమికిదెల్పెద పతిమలవంగాలు చక్కయేలకనల్ల జీల కఱ్ఱ । సమముజాపత్రియు జాజకాయలు యర్థభాగంబు చక్కెర పాళ్లురెండు । గుంటకల్గరసమంటునట్లు మధించి చిల్లగింజల లాగు శీతిపదేను । దినములుసమ పథ్యమునను దిన్నను లవంగాలు తంగేడు మిర్యాలు యేల । కులులవంగచెక్కగూర్చి నీళ్లతోనూరి చిల్లగింజలాగుజేసి జనులు । మూడుమూళ్లనాళ్లు వాడుకీ భువియు న । సుఖమొసంగవలయు సుబ్బరాయ. యిచ్ఛాపథ్యము॥సీ॥ నేల యుసిరిక తెల్లజీలకఱ్ఱ పదేనుదినములు సేవించననాగుతెల్పు । యే ఆకుల్ తోకమిర్యాలు లవంగాలు చక్కెరసమపాళ్లుచల్లతోటి

